కనకమ్మ, చింతలచెర్వు.

శారదా చట్టము

తెనాలి, 1930.

Record no. 39

Kanakamma, Cintalacervu.

Śāradā caṭṭamu

Tenāli, 1930.

Record no. 39

## Bibliographic Record Target

కనకమ్మ, చింతలచెర్వు.

శారదా చట్టము / చింతలచెర్వు కనకమ్మ. - తెనాలి : రజత ముద్రాక్షరశాల, 1930.

(1), 33 p. ;16 cm.

Record no. 39

Kanakamma, Cintalacervu.

Śāradā caṭṭamu / Cintalacervu Kanakamma. - Tenāli : Rajata Mudrākṣaraśāla, 1930.

(1), 33 p. ;16 cm.

Record no. 39

## శ్రీ అన్నపూర్ణాదేవి గ్రంథమాల,

హెడ్డాఫీసు, బ్రాడీపేట, గుంటూరు.
బ్రాంచి, పవరుపేట, ఏలూరు.

ఈ గ్రంథమాల శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారి జ్ఞాపకార్థము - వారియొక్క ద్వితీయ వార్షికోత్సవసమయమున ఆంధ్రసోదరీమణుల తరఫున స్థాపించబడియునది.

సదరు గ్రంథమాల వెలకొకటిచొప్పున సుమారు 50 పేజీలకు తక్కువ కాకుండా సాంఘిక చారిత్రక కల్పనాది విషయములమీద వ్రాయబడిన నవలలు గాని వ్యాసములు గాని ప్రచురించబడును.

పై నవలలు సాధారణముగా ఆంధ్ర యువతీ విద్యాపరిషత్సంఘము వారిచే బహుమతులు బడసినవిగా నుండును. పై గ్రంథమాలకు సం॥ 1 కి రు 1-0-0 మాత్రమే చందా చెల్లించవలెను. ప్రతి చందాదారు 12 పుస్తకములు బడయుగలరు.

### వెలువడిన గ్రంథములు.

[1] విమలానందము, స్వతంత్ర నవల.
గ్రంథకర్త్రి, వడ్లపట్ల లలితాంబగారు, కొవ్వలి.

[2] అన్నపూర్ణాదేవి జీవితము, పవిత్రమైన నారీచరిత్ర.
గ్రంథకర్త్రి, అట్లూరి వెంకటసీతమ్మగారు, అంగలూరు.

[3] పద్మావతి, చరిత్రాత్మకమైన వచనకావ్యము
గ్రంథకర్త్రి, గొర్రెపాటి శకుంతలాబాయిగారు, పరిగతోలు.

[4] అహింసా ప్రబోధము, నీతిదాయకమైన వ్యాసరాజము
గ్రంథకర్త్రి, బాల సీతారత్నంగారు, మరంగూడెం, ఏలూరుతాలూకా.

[5] శారదాపట్టము, శారదానికేతన విద్యార్థినుల వ్యాసములు.

పర్వతనేని వీరయ్యచౌదరి, సెక్రటరి,
బ్రాడీపేట, గుంటూరు.



# శారదాపట్టము.

## : వ్యాసరచయితలు :

ఆంధ్రయువతీ విద్యా పరిషత్తు సంఘముచే నిర్ణయింపబడిన బహుమతులు నందిన వ్యాసరచయితలు.

1 వ బహుమతి. శ్రీమతి చింతలచెర్వు కనకమ్మగారు,
6వ ఆంధ్రవిదుషీ కక్ష్య.

2 వ బహుమతి. శ్రీమతి తుంగల లక్ష్మీదేవిగారు;
7వ ఆంధ్రవిదుషీ కక్ష్య.

3 వ బహుమతి. శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు,
సాహితి 3వ తరగతి శారదా నికేతనం, గుంటూరు.

రజత ముద్రాక్షరశాల, తెనాలి.

కాపీరైట్ 1930 వెల 0—4—

# చిన్నమనవి

ఈ గ్రంధమాలను ఆంధ్రనారీలోకమునకు శిరోమణియు, దేశభక్తాగ్రేసరియు, శ్రీ మహాత్మాజీ ప్రేమంపుపుత్రియు, కర్మకులనాయకీమణియు, మృతజీవియునగు శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారి జ్ఞాపకార్థముగా ఆంధ్రలోకమంతయు నేకగ్రీవముగా చేయు ద్వితీయ వార్షికోత్సవ సందర్భమున మేమును ఉడుతాభక్తిని ఆంధ్ర స్త్రీలోకము తరపున ది 17-10-1929 తారీఖున స్థాపించినారము.

ఈ గ్రంధమాలతో పాటు ఆంధ్రయువతీ విద్యాపరిషత్సంఘమును స్థాపించి స్త్రీవిద్యాభివృద్ధికై పాటుపడదలచి యున్నారము. మా ప్రయత్న మవిఘ్నముగ సమకూర్చి మమ్ముల కృతార్థుల జేయుచుండుటకు శ్రీపరాత్పరుని మనఃపూర్వకముగ ప్రార్థించుచున్నాము.

అయిదవ పుష్పముగా శారదాచట్టమును దయతో నొసగిన శ్రీ శారదానికేతన విద్యార్థినులకు కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

మా గ్రంధమాల అయిదవ కుసుమమగు యీ గ్రంధమును అవ్యవధిగా ముద్రణమునకిచ్చినను శ్రమయని యెంచక అభిమానముతో త్వరలో ముద్రణముపూర్తిగావించి మాకోర్కెను నెరవేర్చినందులకు శ్రీ రజత ముద్రాక్షరశాల వారికి వందనశతంబులు లర్పించుచున్నాము.

29—3—30 ఇట్లు శక్రటరి,
గుంటూరు. శ్రీఅన్నపూర్ణాదేవి గ్రంధమాల.




# శారదా చట్టము

ఇండియా దేశపు శాసన నిర్మాణ సభయొక్క యీ క్రింది ఆక్టు 1929వ సంవత్సరము అక్టోబరు నెల 1వ తారీఖున గవర్నరు జెనరలుగారి అంగీకారము పొందబడి అందరికి తెలియు నిమిత్తము ఇందుమూలకముగా ప్రకటింపబడుచున్నది:—

1929 వ సంవత్సరపు నెం 19 రు ఆక్టు

బాల్య వివాహములను రూఢిచేయు విషయమున నిర్బంధమును విధించుటకైన ఆక్టు.

బాల్య వివాహములను రూఢిచేయు విషయమున నిర్బంధమును విధించుట యుక్తముగా నున్నందున, ఇందువలన యీ క్రిందివిధముగా శాసించడమైనది:—

సంగ్రహ నామమును, వ్యాప్తియును, ప్రారంభమును

1. (i) ఈ ఆక్టును 1928 వ సంవత్సరపు బాల్య వివాహ నిరోధక చట్టము అని చెప్పవచ్చును.

(2) ఇది బ్రిటిషుబెలూచిస్థానమును సంతాల్ పరగణాలునుచేరియున్న బ్రిటిషు ఇండియా అంతకును వ్యాపించును.

(3) ఇది 1930 వ సంవత్సరము ఏప్రియల్ 1 వ తేదీని అమలులోనికి రావలెను.

నిర్వచనములు.

2. విషయములో గాని సందర్భములో గాని విరుద్ధమైనదేదైన నున్న నేతప్ప, యీ ఆక్టులో:—

(ఏ) "బిడ్డ" అను మాటకు మగవాడైనచో పదునెనిమిది సంవత్సరముల వయస్సునకు లోగా నుండు మనిషి యనియును ఆడుదియైనచో పదునాలుగు సంవత్సరముల వయస్సునకు లోగానుండు మనిషి యనియును అర్థము;

(బి) "బాల్య వివాహము" అను మాటలకు అట్టివివాహము చేసికొను మనుష్యులలో నెవరైనను ఒక బిడ్డగా నుండు వివాహమని యర్థము;

(సి) ఒక వివాహ సందర్భమున "వివాహము చేసికొను మనిషి" అనుమాటకు ఎవరి వివాహము అందు మూలముగా రూఢి చేయబడినదో వారిలో నెవరైనను అని అర్థము మరియు

(డి) "మైనరు (యీడురాని మనిషి)" అనుమాటకు పదునెనిమిది సంవత్సరముల వయస్సునకు లోగానుండు పురుషుడు గాని స్త్రీగాని యని అర్థము.

ఒక బిడ్డను వివాహము చేసుకొను, ఇరువదియొకటి సంవత్సరముల వయస్సునకు లోగానుండు ఈడువచ్చిన పురుషునకు శిక్ష.

3. పదునెనిమిది సంవత్సరములకు పైబడియును, ఇరువదియొకటి సంవత్సరములకు లోపునను వయస్సుగల పురుషుడైయుండి బాల్య వివాహమును చేసుకొను ఎవరైనను వేయి



రూపాయిలవరకు వ్యాపించతగిన జుల్మానాతో శిక్షింపబడతగి యుండవలెను.

ఒక బిడ్డను వివాహము చేసుకొను ఇరువదియొకటి సంవత్సరముల వయస్సునకు పైబడియుండు ఈడువచ్చిన పురుషునకు శిక్ష.

(4) ఇరువదియొకటి సంవత్సరములకు పైబడియుండు పురుషుడైయుండి బాల్య వివాహము చేసికొను ఎవరైనను ఒక నెలవరకు వ్యాపించగల విడిఖైదుతో గాని వేయిరూపాయిలవరకు వ్యాపించగల జరిమానతో గాని లేదా యీ రెంటితో గాని శిక్షింపబడతగియుండవలెను.

ఒక బాల్య వివాహమును రూఢి చేసినందులకు శిక్ష.

5. ఒక బాల్యవివాహమును చేయునట్టి, నడిపించునట్టి, లేదా నిర్దేశించునట్టి ఎవరైనను అది ఒక బాల్య వివాహము కాదని నమ్ముటకు తనకు కారణము గలదని అతను రుజువు చేసిన నే తప్ప ఒక నెలవరకు వ్యాపించదగిన విడి ఖైదుతో గాని వేయి రూపాయిలవరకు వ్యాపించగల జరిమానాతో గాని లేదా యీ రెంటితో గాని శిక్షింపబడ తగియుండవలెను.

ఒక బాల్య వివాహముతో సంబంధముగల తల్లికి లేదా తండ్రికి లేదా సంరక్షకునకు శిక్ష.

6. (1) ఒక మైనరు బాల్య వివాహమును చేసుకొను సందర్భములో, తల్లిగాని, తండ్రిగాని, సంరక్షకుడుగా గాని లేదా చట్టసమ్మతమైనదైనను లేదా చట్టవిరుద్ధమైనదైనను మరియే యితర హోదాలో గాని ఆ మైనరును తన యాధీన

ములో నుంచుకొని, ఆ వివాహమును ప్రోత్సహించు వ్యక్తి పనిని చేయునట్టి లేదా అది రూఢీపరచబడుటకు అనుమతి నిచ్చునట్టి లేదా అది రూఢీపరచబడకుండ చేయుటకు అశ్రద్ధ వలన తప్పిపోవునట్టి ఏమనుష్యుడైనను ఒక నెలవరకు వ్యాపించ తగిన విడికైదుతోగాని, వేయిరూపాయిలవరకు వ్యాపించ తగిన జరిమానాతోగాని, లేదా రెండిటితోగాని శిక్షింపబడ తగియుండవలెను:

అయితే ఎట్టి స్త్రీయును కైదుతో శిక్షింపబడతగి యుండగూడదు.

(2) ఈ సెక్షనుయొక్క కార్యముల నిమిత్తము, యిందుకు వ్యతిరేకముగా రుజువు చేయబడిననే తప్ప మరియు రుజువు చేయబడువరకును, ఒక మైనరు బాల్యవివాహమును చేసుకొని యున్న సందర్భములో అట్టి మైనరును తన ఆధీనములోనుంచు కొనియుండు మనిషి ఆవివాహము రూఢీపరచబడకుండ చేయుటకు అశ్రద్ధవలన తప్పిపోయినట్లు భావించబడవలెను.

3 వ సెక్షను క్రిందవచ్చు నేరములకు కైదు శిక్ష విధింపబడకూడదు.

7. 1897 వ సం॥రపు జనరల్ క్లాజుల ఆక్టుయొక్క 25వ (సెక్ష 1897 వ సం॥పు 10 ఆక్టు)ను లోగాని ఇండియన్ పీనలు కోడు యొక్క సెక్షనులోగాని ఏమిచెప్పబడియున్నను దానితో నిమిత్తములేకుండ 3 వ సెక్షను ననుసరించి ఒక నేరస్తునకు శిక్షచెప్పు కోర్టువారు (1860 వ సం 45 వ ఆక్టు) విధింపబడిన జుల్మానాను చెల్లించనియెడల అతడు ఏదైన



కాలమువరకు కైదును అనుభవించవలెనని ఆజ్ఞాపించుటకు అధికారము కలిగియుండ కూడదు.

ఈ ఆక్టు ప్రకారము విచారణాధికారము.

1898 వ సం॥పు 5 వ ఆక్టు.

8. 1898 వ సం॥పు క్రిమినల్లు ప్రొసీజరు కోడుయొక్క 190 వ సెక్షనులో ఏమిచెప్పబడియున్నను దానితో నిమిత్తము లేకుండ, ఒక ప్రెసిడెన్సి మేజిస్ట్రేటు లేదా డిస్ట్రిక్టు మేజిస్ట్రేటు కోర్టు కానట్టి ఏ యితర కోర్టుగాని యీఆక్టుక్రింద ఏనేరమును విచారణకు పట్టకూడదు లేదా విచారించకూడదు.

నేరములను విచారణకు తీసుకొను పద్ధతి.

9. ఈ ఆక్టుక్రిందకువచ్చు ఏనేరమునుగాని, దేనివిషయమున నేరము జరిగించినట్లు చెప్పబడునో అట్టివివాహము రూఢీపరచబడిన ఒక సంవత్సరములోగా చేయబడిన ఫిర్యాదు పైనతప్ప, ఏ కోర్టు వారును విచారణకు తీసుకొనకూడదు.

1898 వ సం॥పు 5 వ ఆక్టు.

ఈ ఆక్టు క్రిందకు వచ్చు నేరములను గురించి ప్రారంభవిచారణలు

10. ఈఆక్టు ననుసరించి ఒక నేరమును విచారణలోనికి తీసుకొను కోర్టువారు 1898 వ సంవత్సరపు క్రిమినలు ప్రొసీజరు కోడుయొక్క 203 వ సెక్షను ననుసరించి కోర్టువారు ఫిర్యాదును త్రోసివేసియుండని సందర్భములో, ఆకోడుయొక్క 202 వ సెక్షను ననుసరించి ఒక విచారణ తామే చేయునైన చేయవలెను లేదా తమకు లోబడియుండు ఏమొదటి తరగతి

మేజిస్ట్రేటునైనను అట్టి విచారణను చేయవలసినదిగా అక్షేంపనైన ఆజ్ఞాపించవలెను.

1898 వ సం॥పు 5 వ ఆక్టు.

ఫిర్యాది వద్దనుండి జామీను పుచ్చుకొనుటకు అధికారము.

11. (1) ఫిర్యాదీని పరీక్షించిన తరువాతను ముద్దాయి హాజరగునట్లు నిర్బంధించుటకు ప్రాసెసు జారీచేయుటకు పూర్వమును ఎప్పుడైనను, కోర్టువారు వ్రాత మూలకముగా, రికార్డు చేయబడిన కారణములను బట్టి తప్ప, 1898 వ సంవత్సరపు క్రిమినలు ప్రొసీజరు కోడుయొక్క 250 వ సెక్షను ననుసరించి ఫిర్యాది చెల్లించవలసినదిగా ఉత్తరువు చేయబడగల ఏదైన పరిహారము చెల్లింపబడు నిమిత్తము జామీనుగా ఫిర్యాదీని నూరు రూపాయిలకు మించని మొత్తమునకు జామీనుదారులతో గాని జామీనుదారులు లేకుండగాని పూచీఖత్తును వ్రాసియివ్వమని గోరవలెను; మరిన్ని అట్టి జామీను కోర్టువారు నిర్ణయించునట్టి కాలములోగా యివ్వబడనియెడల ఫిర్యాదు త్రోసివేయబడవలెను.

1889 వ సం॥పు ఆక్టు

(2) ఈ సెక్షను క్రిందతీసుకొనబడిన పూచీఖత్తు 1898 వ సంవత్సరపు క్రిమినలు ప్రొసీజరు కోడు ననుసరించి తీసుకొనబడిన పూచీ ఖత్తుగా భావింపబడవలెను. మరియు ఆ కోడు యొక్క 42 వ అధ్యాయము తదను గుణముగా వర్తించవలెను.



# పోటీ వ్యాసములపై అభిప్రాయము.

శ్రీ గుంటూరుపుర "శారదానికేతనము" నందు విద్యాభ్యాస మొనరించు కొందఱు బాలికామణులచే "ఆంధ్ర యువతీపరిషత్సంఘము" వారిచే నియమింపబడిన బహుమతు లందుకొనుటకు, "శారదావివాహ శాసన సమంజసము" "శాసనాధిక్కారము" అను నిరుపక్షముల యందును, సిద్ధాంతముగను, పూర్వపక్షముగను, వ్రాయబడిన, వ్యాసరాజంబులనేను ది 27-3-30 తేది నామూలాగ్రముగ నాచే జూడబడియుండుట లభ్యపడినందులకు నేను మిక్కిలిగ సంతోషాంబుధి నోలాడి యుంటిననుట యతిశయోక్తి గానేరదు.

అందు శారదావివాహ శాసన సమంజసమను, వ్యాసముల రచించినవారు (1) శ్రీమతి చింతలచెర్వు కనకమ్మగారు ఆంధ్రవిదుషీకక్ష్య (2) శ్రీమతి తుంగల లక్ష్మీదేవిగారు ఆంధ్ర విదుషీకక్ష్య. వీరిరువురి యభిప్రాయము లమూల్యములై యలరారు చుండెననుట వింతగాదు. అభిప్రాయములకు వన్నెబెట్టునట్లు వీరు మధ్య మధ్య జూపించిన శృతి, స్మృతి. పురాణ చారిత్రాత్మకములగు ధర్మముల నేకములు నిర్వివాదమై, పూర్వాచారపరాయణుల మనంబులను క్షణకాలంబున మార్పునొనరించులాగున సుబోధ్యమైయొప్పుచుండెననుట సత్యదూరము గాదు. భాషాసౌకుమార్యమునందును పదలాలిత్యమునందును

గంభీర భావంబులకును సుభాషితవిశేషంబులకును సమాన స్థానమలంకరించుచుండెననుట సాహితీకోవిదులెవరు సందేహించరు.

అయిన శ్రీమతులగువారిద్దరి వ్యాసములయందొక్క చిన్నభేదము నాబుద్ధికి ప్రాధాన్యముగ గోచరించి యుండె ననుట గూడ చదువరులు గమనింతురుగాక యని మనవి చేయుచున్నాడ.

ఏమన, శ్రీ చింతలచెర్వు కనకమ్మగారి వ్యాసగమనము ధారాశుద్ధిగలిగి, చివరనుండి బట్టింపబడు "నిక్షుదండము" వలె మధురరసాభివృద్ధియు, మహాత్ముల పూర్వాపరవిమర్శనయు, ప్రస్తుతసంస్కర్తలకు పూర్వులొసంగినయవకాశములును, చక్కగ విశదీకరించినందులకీ, వ్యాసమునకు ప్రప్రథమ బహుమానమొసంగి యామెను బహూకరించుట యుత్తమోత్తమమని నాయభిప్రాయమును దెలియజేయుచుంటిని.

రెండవ వ్యాసమునుగూర్చి వేరుగ వచింపనక్కరలేక పైసందర్భములయందు శ్రీమతి తుంగల లక్ష్మీదేవిగారి వ్యాసరాజముకూడ నిష్ఠె పండితమండలి నలరింపజేయుచున్నదనుటకు నేవెనుకాడుట లేదుగాని, మొట్టమొదటనున్న మాధురియంత్యమున కద్వితీయమునొంది, మొదటనుండి భక్షించిన, నిక్షుఖండమువలె, పాడసూపుచున్నదని మాత్రమునుడువక తప్పదు.



తత్కారణంబున నీవిదుషీరత్నమునకు, రెండవ బహుమతి నొసంగి సత్కరించుట యుత్తమ మనియు, నామెయచిరకాలంబున "భాషాభూష"యనుబిరుదంబునకు యోగ్యయగుననియు నేనభిప్రాయమొందుచు మదీయసంతసంబును దెలిబుచ్చుచుంటిని.

ఇంక "శారదాశాసనధిక్కారమును" గూర్చి వ్రాసిన వారైదుగురిలో శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు (సాహితీ శివతరగతి) ప్రథమురాలని వచించుటయందెంత మాత్రమును సందేహింపనవసరము గన్పట్టదు.

ఈమెవ్యాసమునిశ్చయముగ విదుషీలోకమున కాదర్శకప్రాయమని గట్టిగనుడువుచుంటిని. వ్యాసమునురచియించు పద్ధతి నేమందుగమనింపవలసి యున్నది. అదేమన్న, దేనిని గూర్చితాను సిద్ధాంత మొనరింపదలపడినదో యాసందర్భములను పాఠకలోకమునకు సుబోధమగునట్లు ప్రథమమున నావిషయములను జర్చనీయాంశములుగ వ్రాసియుండుట యుత్తమవ్యాసరచనామార్గమని యనుట యందు చదువరులు సందేహింపరు. ఇయ్యదిముఖ్యముగ నిందు బేర్కొనవలసిన విషయమై యున్నది.

తరువాత భాషయందు గూడ నీమె "సాహితీ శివతర గతి" యగుటయుపై వారికంటె వయస్సునను గూడ తక్కువ యగుటయు జూడమిక్కిలి భావగంభీరతయు, ముద్దులొల్కు

పదజాలమును, నవ్వుబుట్టించు సామెతలను గూర్చి, ఎయ్యది భాషాపోషకు నలంకారమగునో నట్టి, వ్యాకరణమునందు గూడ తగినంత విజ్ఞానము గలదని నుడువుట కెంతమాత్రమును వెనుదీయ నవుసరమగపడుచుంట లేదనియు నీమెకు మూడవ బహుమాన మొసంగుట యుచితమనిదలంచి, పైపరిషత్సంఘమువారు నిర్ణయించుకొనిన రెండుబహుమానములు గాక ప్రత్యేకముగ నింకనొకబహుమానముతో నీమెనుగూడ సత్కరించెదరని శ్రీవారిని నేను ప్రోత్సాహ మొనరించుచుంటిని.

ఇట్టియువతీపరిషత్సంఘమును స్థాపించి యువతీలోకోద్ధరణమునకు దీక్షాబద్ధకంకణులగు, శ్రీమద్రాగోపాలకృష్ణయ్యగారికి, చిరాయురారోగ్య భాగ్యంబులొసంగి ముందంజతో వర్తించెదు గాకయని, భగవంతుడగు శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మమును ప్రార్థించుచుంటిని.

27—2—30 } ఇట్లు కవిరాజ్
తెనాలి. } పండిత, దంతనాల నాగేశ్వరశాస్త్రి.

 ఆంధ్రయువతీ పరిషత్సంఘ సభ్యుడు.



# శారదా శాసనమే సమంజసము.

చింతలచెర్వు కనకమ్మగారు, ఆంధ్రవిదుషి, శారదానికేతనం.

భారత దేశమును నిప్పుడు కలవరపఱచిన సమస్యలలో వివాహశాసన మొకటియైయున్నది. అయ్యది నిజముగా బాల్య వివాహములను నవస్థా భాగములనుండి తప్పించుటకు స్త్రీలపాలిటి కల్పతరువనదగినది. కనుక నీచట్టమును రాజప్రజామోదముల నందఁజేసిన శ్రీహర విలాస శారదాగారిని యెంతయో యభినందించ వలసిన విషయమని యాబాలగోపాలము తెలిసిన విషయమే. భారతదేశము సృష్ట్యాది నుండి భర్తృప్రేమల కాధారమై యనుకూల దాంపత్యమున కెంతేని ప్రఖ్యాతి బడసినదియని వేరుగ చెప్పనక్కరలేదు. ప్రేమనే ప్రధానముగఁ దీసికొని భారత నారీమణులు తమ హృదయనాథుని దైవ తుల్యునిగఁ బూజించి ప్రాణేశ్వరు డెంతటికష్టముల యందిమిడి యున్నను, నెట్టిదురవస్థల యందున్నను సహధర్మచారిణులై తన మనసార ప్రేమించి నట్టివాని నేనాడు పరిణయ మాడిరో యట్టి పతివ్రతామ తల్లులు స్త్రీజాతియొక్క యౌన్నత్య స్థితి కాదర్శప్రాయులైన సంగతి లోకమెరుఁగదే

దీనికంతకును విద్య కారణము. కనుకనే పురాణకాలమున గుణ రత్ననిధియును, పతివ్రతా శిరోమణియును, సత్ప్రవర్తన కాలవాల మైనదియు, సావిత్ర్యుపాసనోద్భవురాలు నైనట్టి

సావిత్రీదేవి యుక్తకాలమున విద్యాశిక్షణమొంది తన యిష్టమగు వరుని వరణయమాడి యముసంతటివానివలన భర్తకాయుర్దాయమును, అంధులైన యత్తమామలకు నేత్రప్రాప్తియును, పునస్సామ్రాజ్య ప్రాప్తియును, పుత్రహీనులైన మాతాపితరులకు సంతాన ప్రాప్తియును గలుగఁజేసి, యాపతివ్రతా తిలకము ఖ్యాతిగాంచలేదా. కనుక ప్రతిస్త్రీకి మంచి విద్యల నేర్పి వారి యజ్ఞానాంధకారమునుఁ బోగొట్టవలెను. పదునారు సంవత్సరములకు పూర్వము వివాహము చేసిన యెడల నామెకు చక్కగా విద్య నేర్చుకొనుటకుఁగాని, భర్తకుఁ జేదోడై మెలంగుటకుఁగాని, యవకాశ ముండనేరదు. అట్టి సతీపతుల దాంపత్యము దాంపత్యమని యనిపించుకొనజాలదు. అట్టి దంపతులకు గలిగిన శిశువులు గూడా మిక్కిలి బలహీనులై యనేక జాడ్యముల కాలవాలముగ నుందురు. కొంతకాలమునుండి భారత దేశమందు కొన్ని సంఘములలో మఱింత వింతలుగ బాల్య వివాహము లాచరించఁబడు చున్నవి. ఆపద్ధతియే నేటికిఁ గ్రమముగా నన్ని సంఘములలోనికి నంటువ్యాధివలె వ్యాపించినది. ఎట్లనిన మనకు మహమ్మదీయ పరిపాలన కాలమున మహమ్మదీయ సైనికులు వివాహము కాని బాలికలనుఁదీసుకొని వెళ్లుచుండెడివారు. అందువలన పిన్న వయస్సునందె వివాహము చేసెడివారు. కాని పూర్వము బాల్య వివాహము లెప్పుడును జరుగుటలేదని దేశ చరిత్రములను బట్టి చెప్పవచ్చును. దీనిని బట్టిచూడ ప్రౌఢ వివాహములే



ప్రాశస్త్యములు కనుక ప్రపంచము నందెక్కువమంది గ్రహించరని వేరుగ చెప్ప నక్కఱ లేదు. కొంతమంది మూర్ఖులు బాల్య వివాహములే మంచివి. వానిని మన హిందువులు విడనాడరాదు. ప్రౌఢవివాహము వలన మనకనేక నష్టములు గలుగును. కనుక మీరు బాల్యవివాహములే మంచివని ప్రతి మండలముల యందనర్థదాయక మగు ప్రచారము కొందరు సాగించుట నెంతయు శోచనీయము. పూర్వాచార పరాయణుల మని చెప్పుకొనుచు, భారత రామాయణాది పురాణములలోని విషయములను సమయము వచ్చినప్పుడు ప్రమాణములుగ దీసికొనుచు, దమకిష్టము లేనిసమయముల యందు వాటిలోని సీత, ద్రౌపతి, లోపాముద్ర, స్వయంవరాదుల యంశములను లెక్కసేయక మఱుగు పఱచుట చాలవింతగ నున్నది. ఇట్టి దుస్థితుల కంతకు మూలకారణము బాల్య వివాహములేయని దృఢముగా చెప్పవచ్చును.

అవయవము లైన సంపూర్తిగాని తరుణమున లోకజ్ఞానము తెలియని సమయమున, యాట పాటల యందు తిరుగువేళ బాల్య చాంచల్యము వదలని కాలమున, సంసార భారము నెత్తిఁగట్టి యంపుట వలన నత్తమామల వలన గలిగెడు ననేక బాధల కోర్చి పడమాడు లేక, పదునాల్గు సంవత్సరములకే సంతానవతులై మాతృస్థానము నాక్రమించుకొనుటయా? అట్టి వారికిఁ బుట్టుబిడ్డ లెంతటి యాజానుబాహులో యెంతటి తేజస్సంపన్నులో యెట్టి యారోగ్య వం

తులో చెప్ప నవసరము లేదు సరిగదా, అట్టి వయస్సునఁ బుట్టిన బిడ్డలు సైతము బుట్టిన దినముననో లేక మరుసటి దినముననో నెలవెళ్లుట కావలనో మరణించు చున్నారు. ఇట్టి విపద్దశ హిందూదేశములో మఱియు, నాంధ్ర రాష్ట్రములోని స్వానుభవములను బట్టి చూచిన యెడల ప్రతి మానవునికి దేహము జలదరింపఁ జాలదు. కావున బాల్య వివాహముల వలన వధూవరులకు మితి మీరని నష్టములున్నవి.

పిన్న వయస్సులోనే వివాహము చేయుటచేత వరులకు విద్య నశించును. చదువుకొనదగిన కాలములోనే సంసార బాధ్యత మీఁదపడుటచేత నున్నతవిద్యఁబడయుట కవకాశము లేదు. కనుక వారు దారాపుత్రాదుల పోషణమునకు నేయల్ప యుద్యోగములకో యాశపడి విద్యను మానుకొనవలసిన వారగుచున్నారు! అదియుగాక వారిలో నెవరికో యొక్కరికి దైవికముగ నంగ వైకల్యముగాని, తల్లిదండ్రుల వలనవచ్చిన వ్యాధులుగాని, సంభవించినయెడ లవారల న్యాయముగా సంసారసముద్రమున జీవనప్లవము గడుపుటకుఁ గష్టపడవలసిన వారగుచున్నారు. ఇప్పుడతి బాల్యవివాహములు చేయువారు వచ్చుసంబంధములు మించిపోవుననియో, బొమ్మలపెండ్లిళ్ళ మాదిరిగాఁజేసినయెడల వేడుకలు చక్కగనుండుననియో, నాయనమ్మలు చూడవలెననియో, పెద్దవారి పెండ్లితోపాటు ఖర్చులు తగ్గుననియో, తల్లి చూచుకొన వలెననియో, తలంతుఁగాని వధూవరుల నాలోచింపరు.



వివాహము వినోదము చూచుటయా వధూవరుల యావజ్జీవ పర్యంతమున భరింపవలసిన సంసారసౌఖ్యము ఆనందము, నిరుపమానప్రేమ, పురుషార్థ సంపత్ఫలము, ననుభవించుటయా? ఏదియెట్లున్నను బ్రహ్మచర్యము, ఉన్నతవిద్య తేజస్సంపద, లోకజ్ఞానము, ధర్మనిర్ణయవిచారము, సత్సంతానము, అకలుషప్రేమ, పురుషార్థ చతుష్టయమునందుఁగల పరమప్రయోజనము. వీనింబడయ వలయునన్న నేఁటి శారదా శాసన రూపమును దాల్చిన రజస్వలానంతర వివాహముకన్న యన్యమైనది వేఱొండుగానము. ఇద్దాని వలననే ప్రయోజనములు సాధించుటకు సుకరమగును. బాల్యవివాహమందన్ననో? బ్రహ్మచర్యాధి ఫలముల కవకాశ మేమాత్రము లేకపోవుట యేగాక మీఁదుమిక్కిలి యనర్థములకుగూడ దావేర్పడు చున్నది. అందుచేతనే రజస్వలానంతర వివాహమువలె రమణీయత యేమాత్రము బాల్యవివాహము చేఁగూర్పజాలదు.

ఇదినేడు పూర్వాచార పరాయణులమని చెప్పుకొను వారు కాలాంతరమునఁ గల్గినమార్పులఁ దడువకయే శాస్త్రీయములని చెప్పసాహసించినను హిందువులు మొదట నుండి వేదస్మృతి శాస్త్రాద్రిచిహ్నములే పూర్వకాలపు ప్రౌఢవివాహ పద్ధతులఁ దెల్పుచున్నవి. వానికిఁ దోడు లోకాచారముగూడ బలవత్తరముగఁ సాక్ష్యమిచ్చుచున్నది. అట్లు గాకున్నచో నొక్క బ్రాహ్మణ శాఖవారిలోనే యుత్తరహిందూస్థాన బ్రాహ్మణులకొక యాచారము దక్షిణమున మలయాళ

బ్రాహ్మణులకొక యాచారము ఆంధ్రరాష్ట్రబ్రాహ్మణులకొక యాచారమునగునా? ఇది కేవలమసంగతము. కల్పనాచాతురి భర్త చేసెడు సత్కృత్యములలో సాంసారిక యాత్రనొసగను పంచుకొని తోడునీడగా నుండి సర్వబాధ్యతలు మోచునట్టిది కదా భార్య. అట్టిదియేగద వివాహమునకర్హురాలు. అట్లుండ వేదశాస్త్రములు విపరీతముగ నెప్పుడు చెప్పవు. వేదాంగ ధర్మశాస్త్రకర్తలుగూడ ప్రౌఢావివాహమును గూర్చి ప్రబలముగా వాకొనుటయేగాక లోకాచారమును గూర్చికూడ ప్రత్యేకధర్మముగాం బరిగణించిరి. యేధర్మమైనను నెక్కుడుమంది యాదరించి యొనర్చుటయే ధర్మమునకు విలువయనియు నయ్యదియే ధర్మమనియును మహర్షులు విశాలదృష్టితో స్మృతులురచియించియుండిరి. అయ్యదియే నేడు బాల్యవివాహములను విషవృక్షములకు వేరుపురుగై బరగిన శారదా వివాహచట్టము. అదియేధర్మబద్ధమైనది. శాస్త్రీయమయినది "రాజానుమతో ధర్మః" అనియందురు గదా పెద్దలు, రాజానుమోదమై బహుజనామోదదాయకమై మొదటనుండి నేటివరకును సర్వాచరణీయమై దేశమంతట పరంపరాచారముగ వచ్చుచున్న ధర్మము గాక వేరొకటియెట్లుకాగలదు. అందుకనియే ఆచారః ప్రథమోధర్మః అనిగూడ శ్రీకృష్ణ భగవానుడు రచించియున్నాడు ధర్మమన్న నెప్పటికేది; మనువుకాలమునాటి ధర్మములు పరాశరుని కాలమువఱకు జరిగెనా? జరిగినచో దక్షిణ స్మృతులు పుట్టుట కవకాశము గలదా. కావుననే దేశకాలను సరణముగా



ధర్మములు మారుచుండునని తెలుచున్నది. ఇప్పుడుమన దేశపరిస్థితులనుబట్టియు కాలానుసరణముగ యోచించినను, ప్రజాభీష్టమును బట్టిచూచినను ప్రౌఢ వివాహమంతటి ప్రయోజనదాయకము మఱియొండుగాకున్నది. సమీచీన ధర్మము శాస్త్రసాంప్రదాయమునై యలరుచున్నది. భారతీయుల స్వాతంత్ర్యలతకు బరదోహదమొసంగుచున్నది.



# శారదా శాసనమే సమంజసము.

శ్రీ తుంగల లక్ష్మీదేవిగారు. ఆంధ్రవిదుషీరత్న,
శారదానికేతనం గుంటూరు.

ప్రస్తుతమా సేతుహిమాచల పర్యంత ప్రజా సామాన్యములో గందరగోళమును గల్గించుచున్నది హిందూమత వివాహ విషయక సమస్య. ఇదియే మున్ముందు దేశమునకుం గల్యాణమును గూర్చుబోవుచున్న శారదా వివాహ శాసనము.

ఏ దేశము గాని, యే సంఘము గాని, యేజాతి గాని, యభివృద్ధికి రావలెనన్న స్త్రీలు బలాఢ్యలై సన్మార్గవర్తినులై యుండవలయును. భరతఖండమున నెప్పుడు ప్రకృతిస్వరూపిణియగు నారీమణి సకలజన గౌరవకారిణియై గృహరాజ్యమున రాణియై యుండునో యానాడు భారతదేశము

సుశిక్షితముగా నుండగలదు. ఇప్పుడు భారత దేశములో నిట్టి మార్పులెందులకు కలిగినవియో విచారింతము. ఇట్టిసమయము లో బిల్లు ఎందుకు ప్రవేశపెట్టిరో జర్చనీయాంశము. వీటి యన్నిటికిని మూలకారణము బాల్యవివాహములే. బాల్య వివాహములు చేయుట వలన దేశమధోగతి పాలయినది. ప్రపంచమందే దేశాంతరములను జూచినను, మొత్తముమీద రజస్వలానంతర వివాహములే కనుపించుచున్నవి. కాని బాల్య వివాహము లెంతమాత్రము స్తుతిపాత్రములైనవికావని వక్కాణించి చెప్పగలను. మొదటిది విద్యయే ప్రధానము. కనుక విద్యా విషయమును గురించి విచారింతము.

పూర్వము మన స్త్రీలందరు విద్యా ప్రావీణ్యురాండ్రయి బలాఢ్యులైయుండిరి. ఇట్టిసమయములో మనహిందూ రాజుల పరిపాలన మంతరించి మహమ్మదీయుల పాలనక్రిందికివచ్చినది. మనభారత స్త్రీలు సౌందర్యరాసులగుటచేత మహమ్మదీయులు కామాతురులై స్త్రీలను దొంగలించుకొని తీసుకొని వెళ్లుట మొదలిడిరి. మనము ప్రాణముపోయినను యొప్పుకొందుముగాని మానభంగమున కెంతమాత్ర మొప్పుకోనము. అందుచేతనే స్త్రీలను వెలుపలికి రానివ్వక గృహములయందు దాచియుంచుట తటస్థించినది. అందుచేత విద్యనేర్చుకొనుటకు వీలులేక తల్లిదండ్రులు పసికూనలప్పుడే వివాహముచేయుచుండిరి. అప్పటినుండి నేటివరకు యీ యాచారమే పరంపరగా జరుగుచు వచ్చినది. ఇట్టిదురాచార పిశాచమును పార



ద్రోలి చక్కని విద్య గఱపింపవచ్చుననిన నేటి వివాహచట్టమే మంచియవకాశము, విద్యనేర్చిన జ్ఞానముతో కూడి యలరారు చుందురు. కొందరు పూర్వాచార పరాయణులు స్త్రీలకు విద్య వచ్చిన పనిబాటలు చేయరనియు నిష్టము వచ్చినట్లు చరింతు రందురు. ఇయ్యది కేవలము సత్యదూరమని చెప్పవలయును. ఏల యన విద్యనేర్వనిచో కార్యేషు దాసీ కరణేషు మంత్రి యన్ని అర్యజనోక్తి గలుగుట దుర్ఘటమైన సంగతి కనుకనే భర్తకు తోచని విషయమున భార్యకు చెప్పగల శక్తి యుండగలదు. పూర్వము విద్యనేర్చియేకదా మొల్ల ముద్దు లొల్కు రామాయణము రచించినది. ఆమెకీర్తి నేటికిని దశదిశలయందును వ్యాపించియున్నది. విద్యనేర్పిన పుస్తకములు కూడ వ్రాయగలరు. విద్యనేర్చియుండిన యెడల పిల్లలకు నుగ్గుపాలతోనె విద్యగరపగలదు తల్లి. విద్యనేర్చినవనిత గృహమును పరిశుభ్రతగా నుంచుకొనగలదు. కాన వీటి నన్నిటిని సమకూర్చ గలదు. ఈ శారదాచట్టము మార్పు పదారు వత్సరముల వరకు వివాహముచేయకూడదని యనిరి కావున యీలోపుగా చక్కగా విద్యనభ్యసించ వచ్చును రెండవది వివాహము కనుక నద్దాని గూర్చియిక నాలోచింతము.

హిందువులు పిల్లలకు యుక్తవయస్సు రాక మునుపే పెండ్లిచేయుట యాచారమై యున్నది.

అవయవము లైన పరిపూర్ణము గానట్టి వేళ, మనో వికాసమున కవకాశము లేనట్టి వేళ, సంసార మనే గుది

గొయ్యను మెడకు గట్టుచున్నారు. ఇంతలో గర్భము దాల్చి సంతానవతియై పసిబిడ్డను సంరక్షించుటయా? ఎంతటి వింత? ఇట్టి పసిపాపలకు బుట్టిన బిడ్డ లెంత బలాఢ్యులో యదివిచారించుడు వారు పుట్టిన రెండు మూడు దినములలోనో లేక కొంత కాలమునకో మరణింతురు. లేకున్న గర్భము తాల్చిన తల్లి ప్రసవించి యాపుడే మరణించుట, యాశ్చర్యమైన విషయము కాదు. లేకున్న భగవంతుని యనుగ్రహము వలన బ్రతికి యుండిరా? వారు నసమర్థులై యెందులకు పనికిరాక యుందురు. కొందరు దలిదండ్రులు ధనమున కాశపడి మూడు కాళ్ల ముసలికైన యిచ్చుట చూచు చున్నాము కదా. ఈమె కాపురమునకు వెళ్లిన కొంత కాలమునకో లేక వెళ్లక మునుపో మృత్యువాత బడుచున్నాడు భర్త. అట్టి స్థితిలో నామె విషయము విచారించిన కటికరాగుండెగల వారిమనస్సైన కరుగకమానదు.

తదితర జాతులకన్న బ్రాహ్మణ వైశ్యులందు మిక్కుటముగా బాల్యవివాహము లాచారములై యున్నవి. భారతదేశము ప్రేమాధారమైన దాంపత్యమున కెంతేని విఖ్యాతి నార్జించి యున్నది. ఈయంశములన్నియు నొక్కచోనుంచి చూచినయెడల రజస్వలా వివాహములే శాస్త్రీయములుగా గాన్పించుచున్నవి. మధ్యకాలములో భారతదేశమందలి కొన్ని సంఘములలో బాల్యవివాహము లాచరింప బడుచున్నవి. మిగత సంఘములవారు వారినిజూచి వీరుచేయుట చేత వీరి



సంఘములలోనికిని నష్టజాతక లత ప్రాకియున్నది. పూర్వము ప్రపంచము నన్ని ప్రాంతముల యందును జూచినను రజస్వలా వివాహములే యున్నట్లు గాన్పించుచున్నవి. రజస్వలయైన తరువాత వివాహము చేయవలయును. అట్లు చేసిన దోషమున కరిష్టము సంభవించదు. అదిధర్మముకాదందురా, మనఋషులు చెప్పలేదందురా దీనినిగురించియు విపులముగా విచారింతము. ఆయాకాలమందలి ఋషులు యా యా కాలమునకు ననుకూలముగా శాస్త్రములు మొదలగునవి రచించియుందురు. కాలమునకు తగినట్లుగా మార్పులు గలుగుచుండ వలయును. ఈకాలమునకు తగినట్లుగా మార్పుచేసినారు. ఇదియునుగాక రాజానుమోదమై బహుజనాదరణము బడసినట్టిదియే ధర్మమగునుగదా. దేశకాలములను బట్టి ధర్మము మారుచుండును. రాజునకిష్టమైనది ప్రజలకు ననుకూలమైనప్పుడు ధర్మమందురు. రావణునికాలమందున్న ధర్మము లీకాలమందున్నవా కావున దేశకాలములంబట్టి ధర్మముమారుచుండును. మనజాతికి మన మతమునకును, మననాగరికతకును, నెంతయుకళంకము ప్రాసాదించునట్టిది బాల్య వివాహములే. కాన బాల్యవివాహములను ఛేదించుటకు ప్రయత్నించ వలయును. ఇప్పటిస్థితికి చాలవరకు బాల్యవివాహములు మానిరనియు చెప్పవచ్చును. భారతదేశము యొక్క శక్తినంతటను పీల్చి పిప్పి చేయుచున్న వీబాల్య వివాహములే. వివాహము చేయుచున్నప్పుడు [illegible] మొదలు కని ప్రశ్నరావచ్చును. అన్ని [illegible]యందును సంహారనా[illegible]

నెగ్రాకిన బాల్యవివాహమను తెగులును నశింపజేయుటకు కట్టుదిట్టములతో నున్నగాని బాల్య వివాహములు మానరని తలచిరి కావున ప్రచారములోఁబెట్టిరి. చిన్నతనములోనే వారికి వివాహముచేసి యధోగతి పాలుచేయుట కంటె రజస్వలానంతర వివాహములే మంచివనిచెప్పవచ్చును.

బ్రాహ్మణులలో గొందరు వ్యతిరేకులు తమబిడ్డల కప్పుడే వివాహములుచేసి నైచిరి. వివాహము చక్కగా విద్య నభ్యసించిన తదుపరి చేసిన నామె మనమునకు ననుకూలమైన వానిని తనకులములో పెండ్లి చేసుకొనగలదు. కొందరు దలిదండ్రులు ధనమునకాశపడి యివ్వనున్న పోట్లాడిమైనవివాహము చేసుకొనగలదు. తలి దండ్రులు మూఢునకివ్వనున్న చోనూరకొనదు. ఆమె కోరినవానికివ్వకున్న చంద్రుడు లేకున్న కుముదమెట్లు ముకుళిత నొందునో యట్లేయుండును. ఆమె కులములో గోరిన వానికిచ్చినయెడల యట్టిదాంపత్యమే యానంద వీచీపరంపరలో దేలియాడగలదు. రజస్వలా వివాహములు చేసిన యన్నివిధముల కష్టములు గట్టెక్కగలవు. బాల్యవివాహముచేయుట చేతనే కదా బలాఢ్యులు కానివారును శూరత్వము లేనివారును దేనికిపనికి రానివారునగు బిడ్డలగాంచుట. దుర్బలలగుటయు. కావున రజస్వలా వివాహములే యాచరణములో నుండవలయును. విద్యనేర్చినవారు సంసారముచేయుచున్నప్పుడు వీరికి కలిగిన పుత్రుడు బలాఢ్యుడుగానుండును. తన పుత్రుని శరీరమును మనస్సును జాగ్రత్తగా సంస్కరింపగలదు.



కొందరు ఛాందసులు బాల్యవివాహములు చేసి స్త్రీలనధోగతి పాలుచేయుటకు ప్రయత్నించుచున్నారు. కాన శారదా వివాహశాసన రూపముదాల్చిన రజస్వలా వివాహములే లోకహితముగోరెడివి. ఇక వైధవ్యమునుగూర్చి విచారింతము.

ఏదేశమున గాని, యేగృహమున గాని, యేవీధి యందుగాని, పరీక్షించి చూచితిమేని కనదోయికి వితంతువులే యధికముగాన్పింతురు. తదితర కులములకన్న బ్రాహ్మణులయందెక్కుడు వితంతువులు కాన్పింతురు. ఎందులకందురా కండ్లు తెరవని పసికూనలకే పెండ్లిచేయుట యాచారమైనది. ఇందుచేత వితంతువులు వారియందు మెండు. వితంతువులైన స్త్రీలదుస్థితి చూచినయెడల కఠినమైన మనస్సుగలవారైనను కరిగి కన్నీరు స్రవింపజేయక మానరు. వారు విద్యావిహీనలగుటచేతనే పనికిరాడ. వాండ్లను గృహము లూడ్చుటకును నంట్లుదోముటకును వంటజేయుటకు మొదలగు వాటియందుపయోగింతురు. వారిని కష్టపెట్టు కష్టములు భగవంతునికే తెలియును కాని చెప్పుట నాతరముగాదు. వారికేగాని విద్యవచ్చియుండిన యెడల నెచటనైనను విద్యచెప్పి బ్రతుకకలరు. వాండ్లను పశువులకన్న నెక్కుడు హీనముగాఁ జూచుచున్నారు. తదితరకులముల కన్న బ్రాహ్మణ వితంతువుల యొక్క చర్యపరమహీనముగా నుండును. వాండ్లకుతల వెండ్రుకలుతీయించుట మొదలగు క్రియలు జేయుదురు.

వీరు తదితరకులములలో దలయెత్తి తిరుగుటకు వీలు

లేదు వీరే విద్యగాని, చేతిపనులుగాని నేర్చియుండిన యెడల యెచటనైనను విద్యచెప్పి గౌరవప్రదమైన బ్రతుకైన బ్రతుక వచ్చును. ఇట్టి సమయములో విద్య కాపాడగలదు. వీరికి విద్య ముఖ్యము. కాన శారదా వివాహ శాసనము వల్లనైనను వితంతువుల కష్టములు పోవును. ఇక బ్రహ్మచర్యమును గురించి విచారింతము.

బ్రహ్మ చర్యము పూర్వము ఆత్రేయి మొదలగు స్త్రీలు సక్రమంబుగా జరిపిరి. అప్పటి కాలములో రజస్వలానంతర వివాహము లుండుట చేతనే కదా ఆత్రేయి బ్రహ్మచారిగా నుండుటకు వీలుకలిగినది. ఇప్పుడు కనులు తెరువని పసికూనలకు వివాహము చేయుచుండుట చేత బ్రహ్మచర్యము నెట్లాచరింతురు. ఆరోగ్యమునకు ముఖ్య సాధనము బ్రహ్మచర్యము. కొందరు స్త్రీలు బ్రహ్మచర్యము చేయుటావశ్యకము. బ్రహ్మచర్య మావశ్యకముగ జరుగ వలసినది. వివాహితలు కాని స్త్రీలున్న యెడల విద్యాలయములు నైద్యాలయములు స్థాపించి పోషించ గలరు. కావున నీచట్టము వల్లనైనను బ్రహ్మచర్య మాచరింతురని చెప్పుటకు సాహసించు చున్నాను. మన దేశములో నాంగ్లదేశీయులు బ్రహ్మ చర్యములో విద్యాలయములు స్థాపించి యున్నారు. ఇకనైనను మనవారు దానిని నిర్వహించ గలరు. కావున దేశాభిమానులార! భారత పుత్రులార! మీదేశమును మీజాతిని, మీనాగరికతను, కాపాడ నెంచితిరేని మీబాలి



కలకు రజస్వలా వివాహములు చేయుడీ. దేశమిట్టి దుర్బల జాతికి కారణమై పతితమై యున్న తరుణమున మూలకారణ మారసి దేశ కల్యాణమునకు రజస్వలానంతర వివాహములే చేయుడీ? మన భారత మాతయొక్క పుత్రికలను విద్యాప్రావీణ్యులుగా జేసి భారత మాతను ధన్యతగా నొనర్పుడీ. మీరందరును యీచట్టమును యేకగ్రీవముగా నామోదింతురని నాయభిప్రాయము. విద్య నేర్చిన స్త్రీలు దేశమునకు విఖ్యాతి తీసుకొని రాగలరు. కాన యిది యందరు నామోదించిన యెడల భారత దేశము కృతార్థతను గాంచ గలదు. దేశ శ్రేయస్సును, కాపాడ వలయునన్న సర్వ విధముల శారదా వివాహ శాసనమే యుత్తమోత్తమ మయినది. శాస్త్రీయమైనది. సమంజసమయినది. సకలశుభముల నొడగూర్చునది ఇంతటితో విరమించుచున్నాను.



# శారదా బిల్లనవసరము.

శ్రీ నడింపల్లి సుందరమ్మగారు. సాహితీ ౩ వ తరగతి
శారదానికేతనం గుంటూరు.



శ్రీసోదరీ మణులారా! సోదరులారా!

ఆసేతుహిమాలయ పర్యంతమువరకు శారదాబిల్లును

గూర్చి యల్లకల్లోలము జరుగు చున్నది. శారదాబిల్లును స్థాపించిన ప్రముఖుల యుద్దేశ్యములేవన?

1. స్త్రీవిద్య నభివృద్ధి గలుగుననియు

2. పిల్లలకు చిన్నవయస్సులోనే యేకుంటియో యే గ్రుడ్డియో యేండ్లు మీరినవారలకో యిచ్చుటవలన భార్యా భర్తలకు యన్యోన్యతలేక కష్టముల పాలగు చున్నారనియు,

3. చిన్నతనములోనే సంతానము గలుగుటవలన శిశువులు దుర్బలులై యుందురనియు యిటువంటి కష్టములను తొలగించ గలందులకు స్త్రీలకు పదునాలుగు పదునైదు సంవత్సరములకు పురుషులకు పదునెన్మిది యిర్వది సంవత్సరముల వరకు వివాహములు చేయకూడదనియు ప్రభుత్వము వారి ద్వారా శారదాచట్టమును స్థాపించినారు. దీనివలన వర్ణాశ్రమ ధర్మములు నశించుటయు వర్ణసంకరములు గలుగుటయు ధర్మశాస్త్రములో జెప్పబడిన నీతి ధర్మములు నశించుటయు దప్ప దేశక్షేమమెన్నటికిని గలుగనేరదు.

ఇదివరకు పన్నెండు, పది, సంవత్సరములకు బాలికలకు జేయు వివాహముల వలన గలుగు నష్టములను తొలగించ వలెనను నుద్దేశ్యముతో బయలు దేరిన శారదా చట్టము యను మహామారి ప్రవేశించడము వలన యిందెన్నటికో రాబోవు కష్టమును తొలగించుటకు మారు యీ నాలుగు మాసములలోనే వేనవేల కొలది నెలల బాలికలను బాలురను



కూడా పెండ్లియను వ్యాధితో ముంచివేయు చున్నది. ఏనాడో పాశ్చాత్యులు మనలను మోసగించి శాస్త్రములను గ్రంథముల నపహరించుక వెళ్లి మనరాజ్యమును వారి స్వాధీనము చేసుకొని మనకు యేలాటి హక్కులను యివ్వక వారికి భృత్యులనుగా జేసుకున్నారని యీనాటికి మనము కనులు విప్పి వారితో పోరాడి మనకున్న వారితో బాటు గొన్ని హక్కులను గలుగజేసి స్వరాజ్యము యివ్వగలందులకు వారితో బోరాడు సమయమున మనము నవమాసములు మోసి కని పెంచిన బిడ్డలకు మనయుక్తా యుక్తముల ననుసరించి జేసుకొను వివాహముల కొఱకు మన భారతీయులకుల గురువులైన శ్రీశంకరాచార్యులు మొదలైన పెద్దలు యుండగా మనకు విరోధులైన యింగ్లీషు వారిని యాచించి శారదా చట్టమును నిర్మింప జేయించు కొనుటకు మీమనస్సు లెల యొప్పెనోగదా? దీని వలన మనలో మనకే యైకమత్యత లేనట్లును, మనమీద నిదివరకు లేనటువంటి మరియొక హక్కును ప్రభుత్వము వారికి గలుగ జేసినట్లు విశదపడు చున్నది. ఓ భారతీయులారా! యిట్లు యవివేకులు దురాచార పరాయణులు యుద్భవించుదురని యట్టివారిని మోయ వలసి వచ్చుననియే గోరూప ధారిణియైన భూదేవత కలియుగ ప్రారంభము నకు ముందే కన్నీరు గార్చినట్టు శ్రీభాగవత ధర్మము సూచించు చున్నది. పైనజెప్పబడిన నాలు గంశముల వలన శారదా బిల్లత్యవసర మనిగదా? మీయభి

ప్రాయము. వేరువేరుగా విమర్శింతము తర్వాత యావసరమో నవసరమో తెలియగలదు.

1. పది పన్నెండు సంవత్సరములలో వివాహము జేసిన యడల పదునాలుగు పదునైదు సంవత్సరములకే గృహస్థలైన స్త్రీలకు విద్యాభంగము గలుగునని చెప్పెదరు. పుట్టింటివారికి యత్తింటివారికి విద్యయందభిమాన మున్నయడల గర్భాదాన ముహూర్తమునే నిలిపి విద్యచెప్పించకూడదా? యితర యాటంకము లేవియును లేనియడల విద్యకు బాల్యవివాహమొక యాటంకములో లెక్కించ దగినది గాదు. ఇతరయాటంకము లేమైననున్నయడల వివాహము మానినంతమాత్రమున లాభ మేమి? యీకాలపు విద్యవలన పాశ్చాత్యస్త్రీల పద్ధతులననుస రించి నవనాగరికులనుగా జేయుటయేగాని పూర్వపుభారత నారీమణులవలె ప్రకాశింపజేయుట లేదు. కాబట్టి గృహస్థ లైన స్త్రీలకు పతిభక్తిదైవభక్తియే ప్రాముఖ్యమైనవిద్యగాని యీనాటి విద్య విద్యగాదు. పూర్వము దమయంతి సావిత్రి సుమతి అనసూయ మొదలైన స్త్రీరత్నములు వారిపతి భక్తి దైవభక్తులవలననే వారికి కర్మవశాత్వాతటస్థించిన మహాకష్ట ములనుగూడా తొలగించుకొని మహోత్కృష్టతమమైన పద విని బొందివారికీర్తి చంద్రికలను నీనాటికి నిస్థిర జీవితములనుగా జేసికొని యున్నారు. వారిచరిత్రలను బట్టి జూడ స్త్రీకి పతి భక్తిదైవభక్తియే ముఖ్యమైన విద్యగా తోచుచున్నది.



(2) మనువు వాల్మీకి మొదలైన మహా ఋష్యాదులు వ్రాసిన ధర్మశాస్త్రములలో ధర్మార్థ కామములనే పురుషార్థ ములలో నొకటి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర నాలుగు జాతుల వారికి కన్యలకు పన్నెండు సంవత్సరములకు వివాహము చేయుట యత్యంత పావన మయినదిగా జెప్పి యున్నారు. అట్టి వివాహముల వలన పిల్లలకు పదునైదు పదు నారు సంవత్సరము లైనా లేక వారికి స్వశక్తి పరిజ్ఞానము లేనిదే తలిదండ్రులు వారలకు చిన్నతనము నందే యే కుంటికో గ్రుడ్డికో యేండ్లు మీరినవారికో నిచ్చి వివాహములు చేయుట వలన వారికేమాత్ర మన్యోన్యత లేక వారి జీవితములను కష్ట నష్టముల పాలుచేయు చున్నారనియు, నిక ముందు జేయు వివాహములు కన్యకకు పదునైదు సంవత్సరము లైనా వెళ్లి కొంతవరకు స్వశక్తి పరిజ్ఞానము గలిగి వధూ వరులు స్వయముగా వరించితేనే గాని వివాహములు చేయ రాదని జెప్పు చున్నారు.

గర్భ వాసము నందు బుట్టి యల్లారు ముద్దుగా పెంచుకొను తలిదండ్రులు ముక్కు పచ్చలారని తమ చిన్ని తనయలను యిట్టి ఘోరముల పాలు జేయుదురని జెప్పుట నమ్మదగిన విషయము గాదు. లేక, యొకానొక చోట నట్లు కుంటికో గ్రుడ్డికో నిచ్చుట తటస్థించిన రెండవ వానియందు గూడా నిటువంటి లోపమేదియో యుండియే తీరును. ఇంక నిప్పటి కాల పరిస్థితులను బట్టి కుమార్తెలు గల తలి

దండ్రులు ధనము లేమిచే వరకట్నములు లాంఛనాలు జరుప లేక, యే రెండవ పెండ్లి వానికో, యేండ్లుమీరినవారికిచ్చుట తటస్థించు చున్నది. దీనికి కారణము కొడుకులు గల తలి దండ్రులకు ధనము నందున్న యాశా పాశమే కారణము. బాల్య వివాహము లంతరింప జేయుటకు తోడ్పడిన ధీరోదాత్తులు వరకట్నము లంతరింప జేయుటకు ప్రయత్నించి నను గొంత వరకిటువంటి ఘోరములైనా యంతరించి యుండును. కన్యకకు ప్రౌఢ వయస్సు వచ్చిన తర్వాత తన యిష్టప్రకారము వరించిన వరున కిచ్చుటయే మంచిదని చెప్పుటవలన కన్యా వరయతే రూపం॥ యని చెప్పిన విధమున సౌందర్యమును జూచియే కన్య వరుని వరించును గాని కులభేదములను గాని; తనకు వారలకు పరస్పర విరుద్ధములైన తారతమ్య తలను గూడా గమనించక వయస్సు మీరిన దగుటవలన తలి దండ్రుల మాటలను లెక్కజేయక జక్కదనముగల యే యన్య జాతి పురుషునైనను వివాహము జేసికొనును. అందు వలన వర్ణ సంకరములు గలుగుచున్నవి. కాబట్టి యిటువంటి కష్టములను ఛేదించుటకు బాల్య వివాహమే వజ్రాయుధమై యున్నది.

(3) బాల్య వివాహముల వలన పదు నాలుగు, పదు నైదు సంవత్సరములకే సంతానము గలుగుట తటస్థించు చున్నదనియు నింత చిన్నవయస్సునందు సంతానము గలుగుట వలన శిశువులు దుర్బలులై శౌర్య ధైర్యాదులు లేని వారలై



యున్నారనియు, తల్లులు బలహీనురాండ్రగు చున్నారనియు, దలచు చున్నారు. ఇట్లూహించుట మిక్కిలి పొరబాటు. మనకు ముందు రెండు మూడు తరముల క్రిందట మనమాతామహ పితామహుల యొక్క పితరుల జీవితముల నాటికి వారేవిధమున బలపరాక్రమములుగల వారలయి యుండిరో మనము ప్రత్యక్షముగా జూడని విషయము లైనప్పటికి మన తలి దండ్రులు చెప్పుట వలన వినియున్నారము గదా; వారి కటువంటి శక్తి సామర్థ్యములు ఆహార విహారాదుల వలనను వారప్పటి కాలమున వాడబడు యౌషధముల వలనను, వారి కట్టి శక్తిసామర్థ్యములు గలిగినవి గాని ప్రౌఢలై వివాహములు జేసుకొని కనిన సంతానమగుటవలన గాదుగాదా? సారవంతమైన ప్రదేశమునందు బెట్టి తగు నీటివసతిని గలుగ జేసిన ఫలవృక్షము మనకు స్వల్పకాలముననే మంచి రసవంతమయి రుచికరమైన ఫలముల నిచ్చుచున్నది. చవిటినేలయందు బెట్టి తగునీటి నివ్వక పెంచబడు ఫలవృక్షము చాలకాలము జరిగినను రసవంతమయి రుచికరమయిన పండ్ల నివ్వలేదు. ఇటులనే యాహార విహారదులను నౌషధముల మార్పుజేసిన యారోగ్యవంతులగుదురుగాని బాల్యవివాహములు తప్పించి ప్రౌఢలై వివాహములు జేసుకొనినంతమాత్రముననే యారోగ్యవంతులు కానేరరు.

(4) బాల్య వైధవ్యములనుగూర్చి యాలోచింతము; యుక్తవయస్సునందె పెండ్లిచేయుటవలన వెంటనే భర్తలు

చనిపోవుట తటస్థించినయెడల వారలకు యేలాటి సుఖములు లేక వారి జీవితము లనంత దుఃఖములతో గడపవలశినవారగుచున్నారు. కాబట్టి బాల్యవివాహము లంతరింపజేసిన యిట్టి నిక్కట్టులు దొలగునని మీ యభిప్రాయము. నొసటన్ వ్రాసిన వ్రాలుకన్న గలదే నూరేండ్లు చింతించినన్. యన్నట్లు 12 సంవత్సరములకు ప్రాప్తించు బాల్య వైధవ్యములను తొలగించి ప్రౌఢవైధవ్యములను బలపరచవలెననియా మీ యభిప్రాయము. పన్నెండు సంవత్సరములకు ప్రాప్తించు వైధవ్యము పదునాలుగు సంవత్సరములకు ప్రాప్తించిన నేమిచేయుదును. వీరు యీలోపు బావుకొను సుఖ మేమాత్రమై యుండును. దీనిమూలమునగూడ కొంత బ్రహ్మచర్యమునకు భంగమును మరికొంత దుఃఖమునకు కారణమేగాని శ్రేయోదాయకము గానేరదు. బాల్యవివాహములు లేనియెడల బ్రహ్మచర్యమును జరుపుదుమని దేశసేవకు పురుషులతో బాటు సహాయభూతుల మగుదుమేని యట్టి యవకాశముకొరకు నిరీక్షించు స్త్రీలే యున్నయెడల స్వతస్సిద్ధముగా భగవంతుడే గలుగజేసిన బ్రహ్మచర్యమును గడపలేక వైధవ్యమని చింతించనేల? వారలను చూడలేక యితరజనులు ఆదుర్దబడనేల? దేశసేవకులనుగాగాని విద్యావంతులనుగాగాని జేయకూడదా ? అప్పుడు దేశము మంచిదశకు రాదా? మతధర్మములను మంటగలిపి జేసుకొను ప్రౌఢవివాహమువలన గాదు. భారతస్త్రీల నుద్ధరించుదుమనను మిషతో వచ్చిన శారదాబిల్లను ప్లేగు పది



పదకొండు సంవత్సరములక్రిందట గుంటూరుపట్టణము ప్రవేశించి వెంటనే నశించినట్లు నశించునో లేక నైజాము రాజ్యములో స్థావర మేర్పరచుకొనిన ప్లేగువలె స్థిరజీవియై యుండనున్నదో? భవిష్యత్తునుగూర్చి యెవరు జెప్పగలరు. ఓ భారత సోదరీమణులారా! శారదాబిల్లనవసరము. వేదశాస్త్ర నిషిద్ధ ముభావి కల్యాణమున కాటంకము పాతివ్రత్యమందారవల్లరికి పదనువెట్టిన కొడవలి.





# అమెరికన్ వాచి కంపెని తెనాలి.



అయ్యా, మాకంపెనిలో అన్నిరకముల క్రొత్తగడియారములు సరసమైన రేట్లకు సప్లయి చేయబడును.

రిపేరింగు గ్యారంటీగా చేయబడును. మేము పొందిన యోగ్యతా పత్రములే సాక్ష్యము.



## ప్రకటన.

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి బారట్లా, శతావధాని గారిచే రచియింపబడిన గ్రంథములు.

| | | |
|---|---|---|
| (1) కురుక్షేత్ర సంగ్రామము | | 1—0—0 |
| (2) శంబుక వధ | | 0—10—0 |
| (3) సూత పురాణం | 1వ భాగము | 1—8—0 |
| | 2వ భాగము | 1—0—0 |

వలయువారు:- ఈ అడ్రసుకు వ్రాయవలయును.

అమెరికన్ వాచి కంపెనీ
తెనాలి.

## ఆంధ్రయువతీ విద్యాపరిషత్సంఘ సభ్యులు.

---

1 ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, సెక్రటరి, శారదానికేతనము.

2 కవిరాజ, త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, శతావధాని, బారిష్టరు, చైర్మన్, తెనాలి.

3 పొణకా కనకమ్మగారు, సెక్రటరి, కస్తూరిదేవి విద్యాలయము, నెల్లూరు.

4 పండిత పెనుమత్స సత్యనారాయణగారు, తణుకు.

5 మాగంటి బాపినీడుగారు, ఏలూరు.

6 రావుసాహెబు వద్లమూడి బ్రహ్మయ్యపంతులుగారు, రిటైర్డు డిప్యూటీ కలెక్టరు, గుంటూరు.

ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, ఏలూరు.

8 ఉమతిఁ భాస్కరాంబగారు, రాజమండ్రి.

9 వేదాంతం కమలాదేవిగారు, కాకినాడ.

10 కవితిలక, పులివర్తి కమలావతిదేవిగారు, రాజమండ్రి.

11 కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బళ్ళారి.

అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు, నందిగామ.

13 సహదేవ సూర్యప్రకాశరావుగారు, రాజమండ్రి.

14 పడాల కోటయ్యగారు, బి.ఏ.,బి.ఎల్., హైకోర్టు వకీలు, తెనాలి.

15 కవిరాజ, దంతనాల నాగేశ్వరశాస్త్రిగారు, తెనాలి.

బ్రాడీపేట,
గుంటూరు.

ఇట్లు
కార్యనిర్వాహకుడు
"భక్తకృష్ణ"

చి తాన్ని
చి ఉత్తమం
లేవు –
ఉత్తమ
మనస్సు
ఏ గీతా
చి ప్రశాంతి
తెలచు
భావనా
చావులేని
ప్రేక్షక
లదిగా ఉం
న్ని ఉత్తమ
యి ఉత్తమ
ధించి,
ధనకు దారి
దమయమని
దం చేయ
ంచి చిత్రం!

చేస్తే అనుభవం బాగా తెలిసివస్తున్నాయి.

ప్రతి కథకీ ఒక ఉద్దేశ్యం, ఒక సందేశం ఉండబట్టే అసలు కథను ఇన్నిరోజులుగా ప్రచారంలో ఉంచడం జరిగింది. శ్రీ రెడ్డి గారు హాస్యంతోపాటు ఉద్దేశాన్ని కూడా అనుసరిస్తూ స్పష్టపరుస్తున్నారు.

చిత్రంలో మొదటిభాగంలో హాస్యరసం పొంగిపొర్లుతూ వెల్లువిరిసిపోయింది. రామకృష్ణ (విద్యార్థి) చక్కగా నటించాడు. హాయిగా పాటపాడాడు. మిగతాపాత్రధారులు కూడా కొత్త సరుకైనా రెడ్డిగారి మూసలో బాగానే పోత తేలారు. కాజాసాహెబు చురుకైనవాడే—కాని అనవసర జోక్యాలకొస్తే ఒప్పుకుంటారా ?

రెండోభాగం కొంచెం, తాపీగా నడిచింది. ఎక్కువ శిల్పం చూపవలసిన చోట్లలో తేలిపోయింది. ఆంధ్ర సామ్రాజ్యాన్ని రామకృష్ణుడు రక్షించిన ఘట్టంలో ప్రేక్షకుల ఒళ్లు పులకరించి ఆనందభాష్పాలు క్రమ్ముతాయి. సందేహంలేదు. నాటకం ఫక్కీలో పద్యాలు చదవడం చిత్రానికి రాణించకపోయినా ప్రేక్షకుల్ని రంజింపజేస్తుంది.

ఈ చిత్రంలో మంచిగానో చెడ్డగానో ఒక ప్రత్యేకతవుంది. అది చిత్రాల పేర్లు, తారల పేర్లు, సినిమా మనుషుల పేర్లు సందర్భంగాను

---

డి)
పరిషత్తు అధ్య
కాలు వ్రాయ
కాలు పరిషత్తు
మ్మిదిఏళ్లలో,
రల్ని పరిషత్తు

(6) చెడ్డ ఆర్టును విధ్వంసం చేయటానికి పరిషత్తు చేసినదేమిటి ?.

(7) వచనంగాని, పద్యంగాని వ్రాయ నేర్చిన ప్రతి ఆంధ్రుడు నాటకాలు వ్రాయ సమర్థుడేనా ? రెండువందలమంది పండితులలో నాటకం వ్రాయగల సమర్థుడు ఒకరు కన్నా వుండడంటారు ఇంగ్లీషువాళ్లు. తెలు

